శ్రీరస్తు.

# మానసబోధశతకము.

గ్రంథకర్త.

మునగంటి వేంకటరత్నంగారి శిష్యుఁడగు

ఆయంచ వీరబ్రహ్మాచార్యులు.

బ్రి॥ పెద్దోజు పాపయ్యశాస్త్రిగారి చేతను,

శ్రీమాన్ బొమ్మకంటి వీరరాఘవాచార్యులుగారి

చేతను బరిష్కరింపబడి.

మ॥ రా॥ శ్రీ కోడిమెల కొండయ్యగారి

ధనసహాయమున

నూజివీడు కౌముదీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

మొదటికూర్పు ప్రతులు **500**

1931

శ్రీరస్తు.

కృతిసమర్పణ.

# నవరత్నమాల

---

శ్రీకాంతుఁడు కోడిమెలకుల
రామాశిఁగొండయాఖ్య • రాజితయశు స
శ్లోకునఖిలేప్సితంబులు
జేకూర్చి ప్రోచుఁగాత • క్షితిననిశంబున్

ఉ॥ పండిత పోషకుండఖిల
పాపవిమోచనుఁడార్తకోటులన్
నిండుదయన్ గనుంగొనెను
నిర్మలమూర్తి శివంకరుండునా
కొండలజేనియల్లుఁడున

కుంఠితసత్కృప తోడనెప్పుడీ
కొండయ నామధేయునకుఁ
గోరికల్ సమకూర్చి ప్రోచుతన్.

చ॥ పరమకృపాంబురాశియయి
బాగుగ లోకములన్ సృజించు నే
ర్పరియయి సర్వజీవులకు
ఫాలములన్ మనునట్టి ప్రొద్దులన్
సరగ లిఖించి యెల్లపుడు
సంతసమొందెడు తమ్మిచూలి యా
దరమున గొండయాఖ్యునకు
ధాత్రిఁ జిరాయువు నిచ్చిప్రోచుతన్. 3

॥ నీదుసద్యశంబుఁ నిండెసీ బ్రహ్మాండ
ముందుసూడిమోప సందులేక
వర్ణనంబు సేయ వశమానె కొండిమెల
కొండయాభిధాన! గుణనిధాన!.

క॥ ఖ్యాతిని నెటఁగాంచిన నీ
సత్రంబులుకావె బాటసారులకును స
న్మిత్రమ: నిలువఁగనేత
న్మాత్రుఁడవే కొండయాఖ్య! మహితచరిత్రా!

సీ॥ అమలయశుఁడు కన్న • యాఖ్యుఁడు నీతాత
సాధ్వియా సీతమ • జనకుజనని
నీజనకుండు కో • నేటార్యగుణమణి
జనయిత్రి కోటమ • యనెడుసాధ్వి
సరసులు నాగభూ • షణ రంగయాభిఖ్య
లను నిర్వురును నీకు • ననుజవరులు
బసవమాంబికయను • పరమ సాధ్వీమణి
కులకాంతయైనీకు • నలరెనహహ

తే॥ యెంతధన్యుఁడవో నీవు • నెంచిచూడ
నీదుభాగ్యంబు వర్ణింప • నేరితరము
కొడిమెలాన్వయ దుగ్ధాబ్ధి • కుముదమిత్ర!
కొండయాహ్వయ! విమలస | ద్గుణనికాయ.

క॥ శ్రీరమణీమణి నిరతము
భూరి కృపాంభోధియగుచు ♦ భూస్థలిలోనన్
ధీరా। నీగృహమందున
గూరిమి నివసించి ప్రోచుఁ గొండయమిమ్మున్.

తే॥ కన్నియనుగాని సత్కృతి ♦ కన్యఁగాని
సరసునకు నీయనయ్యది ♦ గరిమఁగాంచుఁ
గాక మూఢాత్మునకునీయఁ ♦ గడమఁగాంచు
మోటుమానిసికొసగిన ♦ మొగలిపగిది.

తే॥ కాన సరసుఁడవగుట మ ♦ త్కావ్యకన్య
నీకొసంగుచు నున్నాడ ♦ స్వీకరించు
కొడిమెలాన్వయ దుగ్ధాబ్ధి ♦ కుముదమిత్ర!
నయగుణని కాయ! కొండయ ♦ నామధేయ!

ఇట్లు,
గ్రంథకర్త,
ముక్కొల్లు పాడు.

పితత్కృతి భర్తయగు మ॥ రా॥ కోడిమెల కొండయ్య గారు పుల్లేపూడిలో 1 స్కూలు. ప్రగడవరములో 1 స్కూలు. జంగారెడ్డిగూడెంలో 1 ఆసుపత్రి, 1 సత్రం. చింతలపూడిలో 1 సత్రము. నూజవీటిలో 2 సత్రములు. అనేకస్థలముల చెరువులుబావులు, చలివేంద్రలు నిర్మింప జేసిన పుణ్యులు కావున వీరినా పరమేశ్వరుండు ఆయురారోగ్య ప్రముఖాఖిల సంపదలిచ్చి రక్షించుగాత.





శ్రీరస్తు.

# మానసబోధశతకము.

శ్రీకరు లంబోదరు ద
రీకర భూషణునిపుత్రు ◆ విమలచరిత్రున్
నాకేశాద్యమరార్చితుఁ
బ్రాకటముగఁ గొల్వుమాశు ◆ భంబగు మనసా.

క॥ విఘ్నహిమైనతేయుని
విఘ్నాంబుద పవనువిఘ్న ◆ విపినకుఠారున్
విఘ్నతమః పటలార్కుని 2
విఘ్నంబులడంచిప్రోవ ◆ వేడుము మ॥

క॥ చదువులవేలుపు కులసతి
సదమలమతి వాణిసుకవి ◆ జనకల్పలతన్
గదలక నీదగునాలుక 3
తుదనిల్వ నుతించు భక్తి ◆ తోడను మ॥

క॥ మురగంటి వంశమునియెడి
పెనువసధికేఁజంద్రుడైన ♦ వేంకటరత్నం
బను నీ గురువర్యుని పద
వనజంబులఁ గొల్చి మెప్పును ♦ వదలక మ॥ 4

క॥ భయభక్తుల నాయంచా
న్వయులను నీదగుపిరిసులఁ ♦ బరమసుకృతులన్
నియతాత్ముల వేంకమ శే
షయ్యలనెప్పుడు దలచి శ్రేయ ♦ మందుము మ॥ 5

క॥ గర్వంబువీడి నీవీ
యుర్విన్ దరఁజారుపండి ♦ తోత్తమవితతిన్
బూర్వకవివరులమటియు న
పూర్వకవీంద్రులమునులను ♦ పొగడుము మ॥ 6

క॥ శ్రీహరి నామామృతమును
దాహముగాఁ బుచ్చుకొనుము ♦ తనిభక్తులతో
స్నేహముసేయుము మెప్పును నీ
దేహమనిత్యంబటంచుఁ దె ♦ లియుము మ॥ 4

క॥ క్రోధాగ్నిని జల్లార్చియు
సాధుసుబోధలను వర్ష • జలధారల నా
రాధింపుము మురహరి నా
శ్రీధరుఁడే నిన్నుదరిని • జేర్చును మ॥ 8

క॥ దేవాదిదేవుడగు ల
క్ష్మీశ్వరు పాదాబ్జములను • స్థిరతరభక్తిన్
గోవిదులౌనస నెపుడున్
సేవించినముక్తిసొంపు • జెందుదు మ॥ 9

క॥ కోరికల నుడిగి శ్రీమ
న్నారాయణుఁడే గతియని • నమ్మిస్మరింపన్
సార విహీనంబగు సం
సార సరిత్కృతినిదాట • జాలెదు మ॥ 10

క॥ ఆశలమొదటకు ద్రుంచియు
నీశుని బరమాత్మునింది • శేశుని రవిసం
కాశుని మదదైత్యేయ వి
నాశుని సేవింపుమీ వ•నయమును మ॥ 11

క॥ తప్పక శిలలోనుంగల
కప్పకెవండొసఁగెఁ దిండి • గరుణాన్వితుడై
యప్పరమేశుని నీవె
ల్లప్పుడు ధ్యానించి మోక్ష • మందుము మ॥ 12

క॥ విదితంబుగ మున్నా ద్రౌ
పది సాధ్వీతిలకమాస • భాస్థలిఁ జెల్లా
పదనొంది మొరలిడఁగ నా
పెదయన్ రక్షించుశౌరి । వేడుము మ॥ 13

క॥ నాగాంతకవాహను నను
రాగంబున బూజఁజేసి । రహిమోక్షంబున్
వేగమ చేకొనఁ జూడక
భోగంబుల విజ్ఞప్తిగ • బోకుము మ॥ 14

క॥ అండముఁ బిండమున బ్ర
హ్మాండంబున నిండివెల్గు • నట్టి హరిని దే
వుండని నమ్మిస్మరింప న
ఖండ పరమపదవినీవు • గాంతువు మ॥ 15

క॥ ఛత్రితశేషు భవలతా
దాత్రుమురాంతకుఁ బరేశు ♦ దనుజవినాశున్
మిత్రేందులోచనుని లో
కత్రయగతుకు స్మరింప ♦ గావలె మ॥ 16

క॥ మంధర గిరిధరు సనక స
నందాదిమునీంద్ర వంద్యు ♦ నరసారథి నా
నందముతో సేవించినఁ
జెందెదు కైవల్యపదవి ♦ జెచ్చెర మ॥ 17

క॥ ఇభరాజవరదుని జగ
ద్విభుని బరంధాము వేద ♦ వేద్యుని శ్రీశున్
రభసంబునఁ బూజింపక
విభవముకలదంచువిఱ్ఱ ♦ వీగకు మ॥ 18

క॥ చక్కఁగ స్మరించుమిపుడే
గ్రిక్కున నావాతపిత్త ♦ కఫరోగములన్
జిక్కి స్మరింపఁగ లేవా
చుక్కల దొరబావనీవ ♦ సుంధర మ॥ 19

క॥ నీరజనాభుని నీవే
మారును భజియించిన గను • మన్ననతో నీ
కోరిక లీడేరుచునా
సూరిజనోద్ధారకుండు • సొంపుగ మ॥ 20

క॥ సాధువు తాంఘ్రి సరోజం
ద్వైధాత్రిని కీర్తిఁ గాంచి • యనఘుండై లో
కాధార భూతుడై నర
మాధవు భజనంబునీవు • మానకుమనసా ! 21

క॥ శ్రీకర భక్తజనావన !
నాకాధిప వంద్యలోక • నాథ ! పరేశా !
కాకుత్థ్స వంశజలనిధి
రాకాశశి ! యనినుతించు • రాముని మ॥ 22

క॥ శ్రీజానకీపతీ ! నగ
రాజాత్మజవినుత ! నన్ను • రక్షింపఁ గదే
పూజించెద నతకల్పక
భూజా !యనిపొగడిముక్తి •బొందుము మ॥ 23

క॥ కందర్ప జనకు నమితా
నందముతోఁ గొల్వనిను న • నయమునుబోరిచుక
మందత ( జరియింపకనీ
సందియమును వీడుమికని ( జంబుగ మ॥ 24

క॥ నాళీకోద్భవ జనకుఁడు
నాళీకాలయా కుధవుడు • నాగశయనుడుక
నాళీకనా భుడగుయా
నాళీకాక్షుని దృఢముగ • నమ్మము మ॥ 25

క॥ దశరథునకుఁ బుత్రుండై
శశిధరు విబుఁ డుించిజనక • జనునిజనతిగా
విశదముగఁ గైకొనిన స
ద్వశుఁడగు రామునిస్మరించు • మనయము మ॥ 26

క॥ పురహరు మిత్రుిండును శం
బరనైరి గురుండుదీనఁ బంధుడు • గానక
బహుపరి విధములనా శ్రీ
ధరు గొల్చిభవాబ్ధినీవు • దాటుము మ॥ 27

క॥ కరివరదుఁడ వ్యయుఁడు భా
స్కరశశి నేత్రుండు సురని • కాయవరదుఁడున్
మురహరి కావున నతనిన్
గరిమనుబూజించిముక్తి • గాంచుము మ॥ 28

క॥ దురితలతా దాత్రుఁ డున
చ్చరిత్రుఁ డు దీనావనుండు • జగదీశుండున్
బరమ పవిత్రుఁ డుగావున
సరసిజదళనేత్రు భజన • సల్పుము మ॥ 29

క॥ రాతిని నాతిగఁ జేసిన
సీతాపతిన్ స్మరింప • శీఘ్రంబుగనీ
పాతకములఁ బాపుచునా
పూత చరిత్రుందునిన్ను బ్రోచును మ॥ 30

క॥ హరిసచ్చరితము లెన్నఁగఁ
దరమా సురగురున కైన • దనుజని చయమున్
బరిమార్చి త్రిదశులను సం
బరమున రక్షించినట్టి • భవ్యుఁడు మ॥ 31

క॥ కరిరాజు పూర్వమొక్క మ
కరిబారిఁ జిక్కి మిగుల • గాసిలుచును శ్రీ
హరి కావుమయని వేడమ
కరిఁ ద్రుంచిరయమున నతని • గాచెను మ॥ 32

క॥ వలమురి తాలుపు నెపుడున్
దలచియు ప్రహ్లాదుఁడమును • తనజనకునిచే
గలిగిన పెనుకష్టంబులఁ
దొలఁగి సుఖంబులను. గాంచె • దూర్ణమె మ॥ 33

క॥ నరజన్మ ముత్తమంబీ
ధరణిఁగల సర్వజీవ • తతులనుగాన్
మఱిమఱి నీవెపుడును సు
స్థిరతను హరిఁ గొల్చిముక్తి • జెందుము మ॥ 34

క॥ మూడింటి పైని భ్రాంతిని
వీడిరు మూడింటిగెల్చి వేల్పులదొరసై
దోడును సేవించినఁ గా
పాపునతండ ఘచయంబు • బాపును మ॥ 35

క॥ భక్తజన కల్పతరువై
ముక్తిప్రదుడై యజస్ర ♦ మునుజగముల నా
సక్తిం బోషించెడి ప్రభుడా
నక్తంచర వైరియైన ♦ నరహరి మ॥ 36

క॥ తరువులలో కల్పకమును
గిరులను జోదంతిమ్మగని ♦ కాయంబునకే
సరిఘనమగు కైవడినీ
ధరవేల్పుల ఘనుడు దైత్య ♦ దమనుడు మ॥ 37

క॥ నగములలో మేరువు ప
న్నగముల శేషుడు ఖగముల ♦ నాగాంతకుడున్
మిగుల ఘనంబగునట్లే
జగతిని దైవములఘనుడు ♦ శౌరియె మ॥ 38

క॥ నమ్మకు బంధుజనమ్ముల
నమ్మకు దారాసుతులను ♦ నమ్మకుహితులన్
నమ్మకు సిరిసంపదలను
నమ్మిభజింపుము హరినిఘ ♦ నమ్ముగ మ॥ 39

క॥ కోరకు మిహసౌఖ్యంబులఁ
జేరకు నేస్తంబుఁ జేయ ♦ చెనటులదరికిన్
బోరకు మార్యులతోడను
మారకు నిముసమునకొక్క ♦ మాదిరి మ॥ 40

క॥ తలిదండ్రులవెతఁ బెట్టకు
బలగర్వంబునను మిట్టి ♦ పడకుమకృత్యం
బులనాచరింపఁ బూనకు
కలనైన నసత్యమాడ ♦ గడగకు మ॥ 41

క॥ ఒరులకలిమిఁ గనియేడ్వకు
తిరిపెం బెత్తుకొనువాండ్ర ♦ దిట్టకునీకున్
బరమేశుఁడి డివదానన్
బరితృప్తిన్ గనుబుధులుశ ♦ బాసన మ॥ 42

క॥ పలుగాకి పనులుసేయకు
కలహమునకుఁ గాలుదివ్వ ♦ గాఁ జనకుమునీ
విలసర్వ జనాళికిం
దలలోనాల్కగ మెలఁగ ♦ దగునో మ॥ 43

క॥ జీవునకును బరమేశున
కేవిధమగు భేదముండ • దిలపరికింపఁగా
గావున నీవెన్నటికే
జీవంబుల హింససేయ • జెల్లదు మ॥ 52

క॥ భూతదయగలిగి నీచే
పాతకములఁ జేయఁ బోక • పరమనియతినా
పూతచరితుఁడగు రాముని
బ్రీతిని సేవింపనిన్ను • బెంచును మ॥ 53

క॥ మలభూయిష్టపు దొల్బొ
మ్మలునగు చెలులగనినీవు • మరులుకొనిన నా
జలజాతాప్త సుతుని దూ
తలు శిక్షించెదరునిన్ను • దప్పక మ॥ 54

క॥ ఈతనువు తిరంబని దా
రాతనయులకొఱకు నైవి • రాముములేకే
పాతకముల జేసిన నీ
వేతీరున మోక్షసౌధ • మెక్కెదు మ॥ 55

క॥ ఉత్తమ జన్మంబెత్తియు
నిత్తెంబు గ్రహింపలేక నీచపు ◆ బవుల౯
మత్తత నోసరించెదు ని
వెత్తెఱగున బుణ్యలోక ◆ మేగుదు మ॥ 56

క॥ కలకాలము జీవింపం
గలవాసిరి నిత్తెమనియ ◆ కార్యంబులచం
చలవై చేసిన నీవా
జలజాక్షుని కరుణఁబడయ ◆ జాలవు మ॥ 57

క॥ మతభేదంబును మానక
యితర మతంబులను దూర ◆ నేటికి వినుమా
మతముల నన్నింటను స
మ్మతమే పరికించిచూడ ◆ మంచిది మ॥ ౫౮

క॥ సతతము నీవాసృష్టి
స్థితిలయ కారణుని బరుని ◆ జిన్మయు నజ! శ్రీ
పతి! పశుపతి! యనిభక్తి౯
మతభేదం బుడిగికొల్వ ◆ మంచిది మ॥ ౫౯

క॥ పట్టెడు సుద్దమొగమునన్
దిట్టముగా నరగదీసి తీరిచియిడినన్
బొట్టిడు బూడిద (బూసిన
గట్టికి జగదీశుకరుణ • గాంచునె మ॥ 60

క॥ పుట్టుట యెప్పుడో ధరపై
గిట్టుట కొరకేగదా య • ఖిలజీవులు నీ
వట్టి విషయ మెఱిఁగియు నె
ప్పట్టున మృత్యువశభీతి • బడకుము మ॥ 61

క॥ క్షితిజననీ నీజనకుల శో
ణిత రేతంబులనుగూడి • నిర్మాణంబై
యతినీచమైన వపువును
సతమనుకొని దుష్కృతములు • సల్పకు మ॥ 62

క॥ మలమూత్ర రుధిరములకున్
నెలవీ కాయంబుగాన • నీ వెన్నటికిన్
గలకాల ముండుననుచున్
దలపకు మటుదలచి ననువు • ధ్యాయకు మ॥ 63

క॥ వేయువిధంబుల మాయో
పాయంబులు బన్నిపిలుచున • భావమునధనం
బీయవాని నెంతగూర్చినఁ
బోయెడుతఱి రాదుపుచ్చు • పోకయు మ॥ 64

క॥ బాగుగ నుండినఁ జుట్టాల్
నీగేహము నిండియుందురు • నిరతంబును నీ
కోగు తటస్థించినచో
నీగుమ్మము దొరిక్కఁడాకను • నిజముగ మ॥ 65

క॥ కాయంబన్న ననిత్యము
ప్రాయము క్రొక్కారుమెఱుపు • భార్యాపుత్రుల్
మాయా ఋణసంబంధులు
నీయేమనినీకు సేవ • చింతును మ॥ 66

క॥ మనవారని కడుప్రేమన్
గనువారల లోనుజూడ • గానొకరైనన్
జనిపోవు కాలమున నీ
వెనువెంటను రారుసుమ్ము • వేదురు మ॥ 67

క॥ సంపాదించిన ధనమున్
గొంపాగోపుల • బొలముల • గోవులనాలిన్
గంపెసుబిడ్డల ( దుదకున్
[illegible]ంపున విడిచపకతప్ప • దే యో మ॥ 68

క॥ శ్రీపతిపై భారంబును
మోపుచు ( బరితాపమొంద • బోక జనుగా
నాపత్కాలంబున నీ
ప్రాపిక సేయంగవలయు • నొప్పు మ॥ 69

క॥ ఎత్తగు మేడలు గట్టియు
మత్తులగుదు ( దలచ ( బోక • మహాబాధనినా
ముత్తెకరంబుల ( బోదురు
మిత్తి తటాలున వచ్చి • మ్రింగ ( గ మ॥ 70

క॥ కుసుమాయుధ జనకుని సం
తసమున సేవించిమంచి • దారి గనక దు
ర్వ్యసనంబులకును లోనై
పసరముగతిగా ( జరింప • బాడియె మ। 71

క॥ రాగవిరహితుం డై భవ
నాగరము దరింపనెంచు ♦ జనునకు నెప్పుడున్
బాగగు నిర్ధారణింగల
యోగంబుల కెల్లరాజ ♦ యోగము మా॥ 72

క॥ ఇమ్మహి నీవీసంసా
రమ్మను నీరమెటు తామ ♦ రలను మెలగు నా
కమ్మర పురువేక్రియ ఁ బం
కమ్మున ఁ దిరుగుచుబులుండ ♦ గావలె మా॥ 73

క॥ ఘనపుణ్య తీర్థసమితిన్
మునిఁ గినఫలమేమిసకల ♦ భూతానీకం
బునుసమముగను భావింపక
వినుమా సేజేయుబోధ ♦ బీతిని మా॥ 74

క॥ ప్రాణముల బోయినసరే
మానము ఁ గాపాడుకొనుట ♦ మంచిదిసుమ్మీ
మేనస్థిరమగు మానము
గానఁగ ఁజిరకాలముండు ♦ గావున మా॥ 75

క|| లోకహితార్థం బైనీ
వేకష్టంబులయి ననున ◆ హింప గవలయున్
నీకే మూఁగు నటుపై
లేకుండిన లాభమంద ◆ లేవ్వా మా|| 76

క|| ఆర్తులయెడ దయఁ బూనుము
ధూర్తులెవరు పడినబాట ◆ తొలగిచనుము స
త్కీర్తిని సంపాదించుము
పూర్తిగ వినుమేనుజేయు ◆ బోధను మా|| 77

క|| పాపంబున కెడమీయకు
దీపము తైలమును బిల్చు ◆ తెరఁగు నీవున్
జేసిన పుణ్యమ్ముల
రూపుమాపంగఁ జేయు ◆ రూఢిగ మా|| 78

క|| పుష్పాస్త్రి జనకున తసీ
పుష్పాభ శరీరు శౌరి ◆ పూజింపటకున్
బుష్పంబు లనన హింసా
పుష్పంబే మొదటిపండ్రి ◆ బుధులో మా|| 79

క॥ మధుపాన మొనర్చెడి నరు
డధమాధముడని వచింతు • రఖిలసుజనులున్
బుధవరులును సేకగ నీ
యధికంబగు పాపకర్మ • మగుటను మ॥ 84

క॥ ధర్మరహితమగు విద్యలు
నూర్కొని చేయింటి నేర్చి • కొనినవృథా దు
ష్కర్మమ్ములు నసియుందును
నిర్మలమగు బ్రహ్మవిద్య • నేర్చిన మ॥ 85

క॥ నేర్చిన విద్య నొరులకు
గూరిమితో నేర్పినను న • సంతత కీర్తి
ద్ధరణిలోఁ గాంచుచుఁ గం
సారాతియనుగ్రహంబు • నందెదు మ॥ 86

క॥ వంచనసేయఁగ నితరుల
లంచంబుల మేపికొట్టు • లనునొక్కముగాఁ
గాంచని విషయంబులనే
గాంచి తిననిపల్కుఁ గాఁద • గదు చెడు మ। 87

క॥ సతతము పరోపకారం
బతులితముగ సల్పుమార్య ♦ లౌనౌననగా
సతతుదృఢ బుద్ధినై నీ
వితరులకును గీడుసేయ ♦ నెంచకు మా॥ 88

క॥ దుష్కర వృత్తి జరింపక
శుష్కప్రియ ములనుబల్కు ♦ చునునీవెపుడున్
నిష్కపటుడై మెలంగిన
దుష్కర్మంబులు నశించు ♦ దోడనె మా॥ 89

క॥ దురితాలోచన లెల్లను
మరపునకున్ దెచ్చుకొనుచు ♦ మాధవునెపుడున్
దరి జేర్పుమయని వేడుచు
బరమార్థంబునకు బాటు ♦ బడుమిక మా॥ 90

క॥ ఎక్కుడి కక్కుడికింగను
కక్కుఱతింబడకు నీవ ♦ కర్మలాసర్పం
గ్రక్కున దగుదునటంచున్
గక్కవిషంబునను బోవ ♦ గూడదు మా॥ 91

క॥ ద్వేషంబు పీడిపరుల్
దూషణ సేయకముదంబు • దోఁలి నిరతమున్
శేషశయను గొల్చిన నీ
దోషంబులనెల్లఁ దొలఁగి • దోఁయురు మ। 92

క॥ క్షితిజరక్షాదు పవవాస
వ్రతములనన్నింటిలోన • భక్తియుతముగా
నతిదీక్ష సల్పుసగాన్రా
వ్రతమే మేలగుఁ గవర్ధ్రు • వమ్ముగ మ। 93

క॥ పరులకొనరించిన మేలున్
మఱపంగాఁ దగదునీకు • మఱినీ వెపుడున్
ఒరులకుఁ జేసిన మేలున్
మఱవంగా వలయుసక్ర • మమ్మిది మ॥ 94

క॥ కొనియాడుచు నీరుల వి
ద్యనుగొంచును గొప్పగాహ్రా • దయమం దెపుడున్
దనవిద్యా కౌశలమున్
ఘనమై నలతిగనెన్న • గావలె మ॥ 95

క॥ మనదీపంబని చుంబన
మొనరింప గమూర్తి కాల ◆ కుంతునెఘన నె
వ్వనికైన నలుపెసమతిఁ
దనవాఁడనిచేర్చునావి ◆ ధంబగు మ॥ 96

క॥ మేలొనరించిన వారికిఁ
జాలంగాఁ గీడుసేయు ◆ చండాలుండా
కాలుని దూతలశిక్షల
పాలఁబడు ననుచు దెలియ ◆ పలయును మ॥ 97

క॥ అన్యయం బితరులఁ జెరుపఁగ
మనమున నూహించుచునుఁగ ◆ మమ్మొరుగఁధా
త్రినిసాధుల దూరెడి దు
ర్జన సాంగత్యంబుసేయ ◆ జనకుము మ॥ 98

క॥ వసుమతి సజ్జ్ఞానంబున
సిసుమంతయు మంచిచెడ్డ ◆ లెఱుఁగకబుధులఁ
గసరుచు నిందలొనర్చుయ
రసికులతో మాటలాడ ◆ రాదో మ॥ 99

క॥ కన్నియల విక్రయించిన
బున్నెంబను గంటిపోవు • బుధవరు లెప్పుడున్
నిన్నిస్సీయని రోసెద
రెన్నటికీ వగ్గుసేయ • నెంచకు మ॥ 104

క॥ ఫణిశయనుని సాక్షిగ ధా
రుణిలో యోచింపఁగా న • రులకెన్నటికిన్
ఋణబాధఁ బడుటకన్నను
రణమొందుట మేలుసత్య • రంబుగ మ॥ 105

క॥ గురువుల మనికొందఱు కొం
దఱుశిష్యులఁ గూర్చివారి • ధనముఁ గొనుచు నా
శన మేసిఁ జూపలేరా
గురువుల నెన్నటికినమ్మ • గూడదు మ॥ 106

క॥ చెఱకు రసంబునకన్నను
మఱిపనస రసమునకన్న • మధువునకన్నన్
వరశర్కర కన్నను (శ్రీ)
హరినామామృతముతీయ • నగునో మ॥ 107

క॥ పాత్రత నెఱుఁగక దానము
పాత్రునకు నొసంగమంచి ◆ ఫలముకలుగు నే
క్షేత్రంబెఱుఁగక బీజము
ధాత్రిని నాటినటువలెవ్య ◆ ర్థ మగు ము॥ 108

## సంపూర్ణము.

ఓం తత్సత్.



